# 1. తపః ఫలము

శ్రీపెరంబుదూరు శేముషీ భక్తికి
పురుడు దీర్చుపుణ్యభూమి; తత్పు
రీప్రభాకరుండు బుజానర్త్తకేశవ
సోమయాజి సితయశోవిరాజి ||1||

అతనిసతికాంతిమతి; సార్థకాఖ్య; సద్గు
ణాభిరామ సుందర సుమశోభితాంగి;
తీర్చితిద్దినబొమ్మ, పతివ్రతాఢ్య
వారిద[illegible]త్యమాదిదంపతులవరము ||2||

వారిరంగిభో[illegible]మెల్లని
గ్గంధ కు[illegible], [illegible]షని గాచినశర
దిందుచంద్ర[illegible], రసహృదయాలు చెదరగ
సంతు శాంతిలేక జంటకొఱగె ||3||

చేయునదిలేక దంపతుల్ చెన్నపురికి
వచ్చి, యిలవేల్పుకులవేల్పుపార్థసార
థిన్ సుదర్శన క్రతువుచే దృప్తిపరుప,
స్వప్నమందాప్రభుండు సాక్షాత్కరించె ||4||

నింగినీలాల సంద్రమే నేల నిండి
ఆహానాహతధ్వనులడగిపోవ
కనులుమిరుమిట్లుగొలిపెడికాంతులెగయ
స్వప్నవీథీతరంగాలు సాక్షులగొన ||5||

అలల తరగలనురుగులే యాయనంత
కోటిఫణిఫణవ్రాతమ్మై, గుణగణావ్వి
తస్వరూపంబున్నై, దిశదశలవెలుఁగ;
వేయిపడగలకాంతియాదోయిఁగలిసె ॥6॥

నాల్గుచేతులురెండయ్యె, నల్లనయ్య
భువనమోహనమూర్తియై ముందునిలచి
చేతిలీలారవిందాన శిరముదువ్వ
భల్లటంచునుతెల్లగాతెల్లవారె ॥7॥

జలధినుండి పైబడు కర్మ సాక్షికరణి
వారు లేచి సుస్నాతులైవచ్చి, ఆల
యాంతరద్వార కక్ష్యల నధిగమించి,
పార్థసారథిఁ జూచి స్వప్నంబు మెరయ ॥8॥

స్వామి! నీచేతలేమని సన్నుతింప
క్షణమునిలుకడలేని సాగరము నెదుట
నిర్నిమేషుండవై నిల్చునిన్నుజూడ
చంచలజగత్ప్రభావమే శాశ్వతమగు ॥9॥

కలలోగన్పించితి, మా
తలలన్ పూజేత తడిమి తనిపితి శేషా
చలఫణిఫణాగ్ర దీప్తులు
ఫలమావో! కమలవంట భాగ్యంబెటులో? ॥10॥

అంతలోనర్చ కుండిచ్చు హారతిగొని
ప్రభుని విడలేక విడలేక వారుభూత
పురిని జేర, నావర్షంబు ముగియుమండ
కాంతిమతి గర్భవతియయ్యె కలలుపండె ॥11॥

ప్రథితపింగళినామ వర్షము విశాఖ
శుద్ధపంచమి, గురువార శోభితమ్ము
కటకలగ్నమారుద్ర నక్షత్రమందు
పుత్రుడమృతాంశ తేజస్వి పుట్టెనంత ॥12॥

యామునుల శిష్యుడు, వరదేవాధిరాజ
సుతుడు, శ్రీశైలపూర్ణుడు సోదరిప్రస
వింప మేనల్లుచూడగ వేగవచ్చి
వానిజాతక చక్రంబు వ్రాసి, మురిసి ॥13॥

కాంతి! నీబిడ్డ రూపురేఖలకనువుగ
భావిభాగ్యోదయ శ్రీల బలికెద.విను;
వీడుశేషాంశసంభూతు డేడుగడ,మ
హీస్థలికి, మంగళప్రదుండెల్లరకును ॥14॥

అద్భుతంబగువీని గ్రహగతి చూడ
శంకరభగవత్పాదుల సరణితోచె,
నిరువురికి లగ్నమొక్కటే యిరువురికిని
జన్మనక్షత్రమొకటె మాసంబునొకటె ॥15॥

రాహువేకాదశంబున ప్రబలుడయ్యె
రవి బుధ భృగులు దశమకేంద్రస్థులైరి
షష్ఠమందిద్దరికి శని సమము, కాని
వాక్కుజాడు వ్యయ గురుడు నీపట్టికుండె ॥16॥

రవి కుజాలబరివర్తన ప్రభయొటంగ
వాక్కు టంబదోషంబులు పరిహ్రాతియగు
ద్వాదశగురుండు చాటె తథాగతుని ద
యార్ద్ర చిత్తము దళిత రక్షణదీక్ష ॥17॥

అనగ, యన్నా! జగద్గురుండౌనె? వీడ
ని సుతుఁజూడగ, కేశవుండేగుదెంచి
బావగారు మే నల్లుని భాగ్యకణిక
చెల్లెలకు కొండలన్జేసి చెప్పుటరుదె? ||18||

నాగ ఆచార్య శంకరునంతజాణ
కాగలడునీసుతుండనగ, వలదువల
దయ్య! అల్పాయువై, నిర్గుణాన్వితసుతు
చూడలేనన పూర్ణుడు స్రుక్కుచుమది ||19||

మరల జాతక మొకసారి తిరుగవైచి
తృప్తుడై! భావ నీమాటలేటపడియె
శంకరగురులకున్న షష్ఠాష్టమగ్ర
హాపరివర్తనదోషమేయంటదిందు ||20||

ఆయుః కారకుడగు శని
ఆయుః క్షేత్రేశుడగుచునాటింటశుభ
స్థాయిగురుచంద్రు దృక్కుల
నాయుః పరిపూర్ణుడౌ త్వదాత్మజుడిలపై ||21||

వీడుతాతరించుటెకాదు, విపులవిశ్వ
మునుతరింప ఁజేసెడి ధర్మ మూర్తి, చూడ
నాదిశేషుడే లక్ష్మణాఖ్యనిల ఫరగు
నితని వెన్నంటి వెన్నుడే హితము గూర్చు ||22||

పరివర్తిత రవి కుజులన్
బరిశీలింపగ స్థిరముగుభావములఁ హా
క్షయపిత మద్రేకంబులఁ
బరిమార్చు సుదీర్ఘ జీవ భాగ్యములందున్ ||23||

తపముకంటె భక్తియే గొప్పతత్త్వమంచు
ధర్మమునకంటె దయయే ప్రధానమంచు
వ్యక్తికంటె సంఘమె ముక్తి పథమటంచు
క్రొత్త దేదా! సిద్ధాంత మేకూర్చు నితడు ॥24॥

శంకరులకంటె సులభుడై జగతినాత్మ
తత్త్వమెల్లరకును జూపుదార్శనికుడగు
పిన్నవాడయ్యు పెద్దల పెద్ద, యీత
డంతయు జగదంబ యనుగ్రహమనివెడలె ॥25॥

ద్యుతిమతి రెండవచెల్లె ల
నతిదూరంబున కమలనయన భట్టునకుఀ
సతియై పరమేశ్వరుదయ
సుతుఀగాంచుట విని రయమున చూడఀగ వచ్చెఀ ॥26॥

వచ్చి చెల్లెలి యొడినున్న పాపనిగని
పాపడీ శ్వరార్చన కళాప్రాభవుండు
పరమవైరాగ్య భావ సంపన్నుడగుచు
సార్థకా ఖ్యుడై గోవింద సముడగునని ॥27॥

తిరుమలఀజేరి మహోన్నత
గిరి శిఖర జ్యోతి నరసి కీర్తించె సదా
తిరుమలనాథుని, జగమే
తిరుమల నంబియని యతని దివ్యత పొగడఀ ॥28॥

అమదిన మాయిరువురు నం
దములానందముగఀ బెరిగి తరుణోదయులై
జనమత జీవనులై (బ్రా
హ్మణమున కనువుగ నతిపెర్గి యధ్యయనంబున ॥29॥

ఆ మరు నోడించు, కుమా
రా మృతుడని, యెదిగి వచ్చునాత్మజుఁ జూచున్
రామాయని ప్రేమంబున,
రామానుజుఁ బిలిచి తండ్రి రాముని మఱచెన్ ॥30॥

పదునారేడులప్రాయము
మృదుహృదయము చురుకు బుద్ధి మీసపుమొలకల్
చెదరని చిత్తము నెల్లర
యెదకొత్తెడి వెడదయురము నిందుముఖంబున్ ॥31॥

మిసమిసలాడెడి మేన్వాడ,
పసిడిరుచుల భంగపరచువైభవ మాజా
నుదీర్ఘబాహువులఁ గని
వసుధైకసుకృతిగ సుతుని భావించు, తరిన్ ॥32॥

పండితులు మెచ్చువినయము, పడతుల తమి
కూర్చుచెలువము, చూచి, సంకోచముడిగి
పలుకరింపగ దూరపు బంధు జనము,
కొడుకు పెండ్లికి తహతహపడెజనకుడు ॥33॥

సత్కుల ప్రమాత, సౌందర్య విధి సంప్ర
దాయబద్ధ జాణ ధర్మనిష్ఠ
జ్ఞానయువెడికన్యకన్ జూచి సుతునకు
పెద్దలనుమతింప పెండ్లిచేసె ॥34॥

భక్తి చే సతి జ్ఞానాన పత్నియగుచు
కోడలలరింప సుతునంత కోర్కెలూగ
తండ్రి కేశవుడు వైకుంఠ ధాముడయ్యె
కూడుకొనెడి సంసారయోగమ్ముకూలె ॥35॥



శ్రీ రామానుజ అవతారస్థలము, శ్రీపెరుంబుదూర్

# అధ్యాయము - 2

భూతపురివీడె నుపనిషద్బోధయుగయు
గాలనాచార్యపీఠమైఖ్యాతిగాంచు
కంచివేరె లక్ష్మణుడువాక్యార్థనిర్ణ
యంబునవిశిష్టవిద్యార్థియైవెలువడె ॥

# 2. జిజ్ఞాస

రూపమే మారు తల్లిని లోకమెఱుఁగ
ని సతిని, హఠాత్తుగాబద్ధనిస్తుంగగృహ
భారమంతయువరదునిభారమంచు
లక్ష్మణుడువెస౯ భూతపురంబువిడిచె ॥1॥

కంచికిన్ కాపురముమారె గడియ గడియ
కావరదుడేకనుల్‌గట్ట కలతఁబడక
స్వామిసేవలో సంసారజలధి నీద
యత్నమొనరించె రామానుజార్యుడంత ॥2॥

స్వామి శయనించుమెత్తనిపాన్పుఁజూచు
నావిశాల రాజీవనేత్రాంతరుచుల
పూర్వవాసన లేవియో పొటమరింప
జాలువారుకన్నీటిలో శ్రమలుమఱచె ॥3॥

దినమేదొ వారమేదో
తనపరిసరస్పృష్టియేమొ! తలపోయక ;నె
మ్మనమావరదునిచెలువం
బునచెలువమగుచు నతండు బొమ్మగనిలువ౯ ॥4॥

అన్నా! యనిగోవిందుడు
తన్నుంగని వెనుకనుండి దబ్బుకొనంగా౯
వెన్నుడనిపుల్కు పుల్కన
కన్నులరామానుజుండుగని సహజన్ము౯ ॥5॥

కంటనీరూర పిచ్చిగాఁగాంచునన్ను
తో; నతగతీయనిమాటయైన లేక,
ఊరుకూరె మార్చితివి, మాయునికికూడ
దలపవే? యని గోవిందుడలుకఁబలుక ॥7॥

ఏమని చెప్పుదుతమ్మా!
నామదిమదిలోన లేక నలిగె పితృపదం
బీమహి విడనాడ, వరదు
డే మనుగడయని చరింతు నెటులో నిచటన్ ॥8॥

పదపద మనయింటికివా్న్
పెదవులచిరునీవ్వుచింద పెదతల్లిని మా
వదినెనుదర్శించియె యీ
సదనంబుననిన్నుఁగంటి స్వాంతము పొంగన్ ॥9॥

గతమున్నకైచింతించుట
మతిమంతులగుణము కాదు, మాన్యుడవు, మహో
న్నత విద్యా విభవుండవు
బ్రతుకున పరమార్థమరయ శ్రమియింపదగున్ ॥10॥

యాదవ ప్రకాశుడు పరమార్థతత్త్వ
మణువణువున జీర్ణించు కొనిన మహాను
భావుడంట యాగురుని కొల్వనిట హరి య
నుగ్రహము కల్గునంచు ముమ్ముందుకేగ ॥11॥

వినవచ్చె గభీరధ్వని
కనువుగ శాస్త్రప్రబోధ మద్భుతమీ పూ
వనములు మధుపోత్కర్షమై
కనుపించియు శుక పికముల కలరవమడరెన్ ॥12॥

కాని,మంత్రముగ్ధుడై నిండుభక్తిని
కేలుమోడ్చిబోధనాలకించు
శిష్యతతిని (జూచిశీఘ్రమేగోవిందు
డటకునడచె నన్న ననుసరించె ॥13॥

ప్రవచన ప్రభావంబు, తర్కప్రతాప
మతులితస్మృతి శ్రుతిపురాణతతిగతుల
విస్తరించు చమత్కృతి విధికి, మెచ్చె
కాని రామానుజుడుకాలుకదుపడయ్యె ॥14॥

ఏదోతెలియని కౌఅతయె
వేదన కల్పింప, పట్టుపీడగమూడ౯
సోదరుడన్నా నిలునిలు
యాదవగురుజూచిముందు కరుగ శుభమన౯ ॥15॥

ప్రవచనంబు ముగిసె శిష్యవర్గమేగె,
యాదవగురుని జూచి, యత్యంతభక్తి
విచ్చ, వినయ విధేయతల్ విరగబండ,
అరటిగెలరీతి మ్రొక్కరామానుజాగని ॥16॥

ఎవడవన్న ! నీవు; ఏమియీకన్నుల
దివ్యశక్తి, తీర్చిదిద్దినట్టి
రూపురేఖలు, మతినూపెడివర్చస్సు,
నిన్ను (జూడగంటి నిజముగంటి ॥17॥

చేరవచ్చియాదవుడు నాచిన్నవాని
యెగుభుజంబుల( బట్టి తిప్పిగనెదయెద
జేర్చి యేమికాంక్షించివచ్చితివిట కన,
విద్యగోరితిమంచు గోవిందుడల్ల ॥18॥

ఇతడుమాపెదతండ్రి వరతనయుడు, హ
రి తనగోత్రుడు యాజుషీ శ్రుతికి చెందు
ఘనుడు తండ్రి కేశవసూరి ఖ్యాతయశుడు
పేరు రామానుజుడన గోవిందుఁజూచి ॥19॥

మెదడున దాగినగరువము
మెదలగ కనుగొనల తీవి మేల్కొనుచుండన్
పెదవుల లేనవ్వులొలుక
బ్రదుకును బ్రహ్మంబొవర్తు రారండనగాన్ ॥20॥

యాదవగురు పరిచర్యల
వేదోపనిషద్రహస్య వివిధార్థంబుల్
సోదించెరువురువెస, ధీ
రోదాత్త ప్రజ్ఞనేర్పు యూర్జిత శక్తిన్ ॥21॥

శిష్యవర్గంబున కడు విశిష్టుడగుచు
గుండె బలమొచు రామానుజుండు గురుని
నిశ్చలజ్ఞాన సీమితవిలువుదెలిసి
పాండితీప్రజ్ఞల బ్రాభవంబెరింగె ॥22॥

యాదవగురునొక్క పరి రామానుజుండు
తైలమర్దన మొనరించు తరుణమందు
వెనుకనున్న వేఱొకశిష్యవినతుడడిగె
దేవ! మొన్నఛాందోగ్యసూక్తిందెలుపుచు ॥23॥

కప్యాసమునకు వివరం
బాప్యాయనముగ నడివిన అర్థంబేమో
ప్రాప్యముగాదు మదికి, సా
రూప్యస్థితి దెలుపు డనుచుమ్రొక్కగ గురుడున్ ॥24॥

పుండరీకాక్షుని నయనములెరుపని వ
చింపశ్రుతికపిపృష్ఠమున్ స్మృతికి దెచ్చె
నింతియే గాని వివరింపనింత కంటె
నిట విశేషమే లేదనె నిర్ధగురుడు ॥25॥

కర్ణశూలమ్మై గురునివాక్యంబులాత్మ
కలచ జొటజొటకన్నీటికణములురల
తనువువడవడవడకుచుతన్నవశము,
లక్ష్మణునిలేతహృదయమల్లాడదొడగె ॥26॥

బాష్పములు;సుస్రనితొడపైబడ గురుండు
చయ్యన శిరంబునెత్తి "వత్సా!"యిదేమి?
నీకుకన్నీరె? యేటికీయాకులమున
గద్గదంబున గురుపాదకమలముగని ॥27॥

తోచు సత్యంబుముందుకు ద్రోయుచుండ.
గురుతిరస్కృతియె వెనువెన్కకుపడదోయ,
చేయునదిలేక చెప్పగ చేతగాక
చీకటితుపానువావగా శిష్యుడుండ ॥28॥

"చూడలేను! నీదు శోకంబురామ! ప్ర "
జ్ఞానికిట్టివెతలు కలుగుటెటులొ?
స్వేచ్ఛగ, గగవాన విహరించుఖగపతి
కీటకమక పుట్టుటెట్టులయ్య? ॥29॥

జ్ఞానమూర్తివి దిగ జారిపోవగునె? తో
చినదిభయములేక చెప్పుమన్న
యా[illegible] శిష్యుడంజలిబద్ధుడై
[illegible]చుడు విన్నవించె ॥30॥

శ్రుతులలో సామవేదము సుకృత శిఖరి
అందు ఛాందోగ్యమధిక గుణాన్వితంబు
పుండరీకాక్షుని నయన మోహన స్వ
రూపమెఱిగించు మంత్రము రుచితరంబు ॥31॥

ఆచిదానందు నేత్రద్వయంబతుల మ
హాప్రభల వెల్గుచుండకప్యాసమంచు
నొక్క నీచోపమానంబు నోర్వననగ
అన్యమేమని గురుదృక్కులతని నడుగ ॥32॥

క యనజలము, పి యనపీల్చు, కపియనరవి,
వికసితంబాస, రవిచేత విరియుగాన
కమల మిచట సిద్ధంబునైగంధరుచిర
మధుర గుణములే బ్రహ్మమ్మె మదినలరు ॥33॥

ఒక్కటేరెండు కన్నులైయొక్కచోట
మూడు గుణములప్రకృతికే ముద్దుగొలుపు
అట్టినిత్యసౌందర్య మనాదరించు
టెటులో! దేవా! క్షమింపుడీ భృత్యు ననగ ॥34॥

నీనివాక్కులో సత్యమే విస్ఫురించె
ననిగురుడు శిష్యుఁజూడకన్నార్పకుండ
శంకరుడెమదిలోన సాక్షాత్కరించె,
నిర్గుణబ్రహ్మ కీవ్యాఖ్యనీరసంబు ॥35॥

కపి , కమలము,కడకు కమలాప్తుడన్నియు
శక్తిరూపములుగ సాగుచుండె
ఉచ్ఛ నీచములని యుడుకుమ భావదో
షమున జీవజగతి సతమతమగు ॥36॥

అస్థిమాల యైన, యాకౌస్తు భంబైన
అమృత మైన, హాలహలమె యైన,
బ్రహ్మమునకు చేటుపాటులేదని
స్వానముస్ సలుపగ జనెగురుండు ॥ 37 ॥

మఱియొకపరి రామానుజు
డరుదెంచి, నమస్కరించి, యాదవ చరణాం
బురుహంబుల, కాతనిత్తై
త్తరీయ పాఠప్రవచన తర్కంబునిడె ॥38॥

సత్యజ్ఞానమనంతం
బిత్యవధారితము బ్రహ్మమిది సర్వంబై
నిత్యం బానందంబై
అత్యంతం బేక మగుచు నంతటనుండె ॥39॥

జ్ఞానసత్యమనంత గుణత్రయమున
కలిసి యొక్క చోనుండుట కల్లగాన
బ్రహ్మమన నిర్గుణంబగు ప్రకృతిజీవ
జగములన్నియు మిథ్యయై సాగుచుండె ॥40॥

చంచలంబై సదామారుజగతికెల్ల
మూలమా బ్రహ్మమే యది మూర్తికాదు
దానినిత్యర్థముస్ జేయుతర్కశక్తి
లేదు శాస్త్ర మొకింత స్ఫురింప జేయు ॥41॥

ఇంద్రియాతీ తమైబుద్ధి కిమడకుండ
కనుపడిరీతికవ్విపక మతి కలఁచు
సచ్చిదానందమా మహోక్తియిదియె
జీవుడువిరాట్స్వరూపాంశ చింతజేయ ॥42॥

అనృతమునకు భిన్న మైనదే సత్యంబు
జడముగానిదెఱుక సకల మెఱుఁగ
అంతమందనిదె యనంత మిదియెవిర్గు
ణమిది బ్రహ్మ మేయనగీగురుండు ॥43॥

సత్యమిదికాదు కాదని స్వరమువడక
గౌణగురామానుజుంగాంచి గుంపుకలఁగ
కలతచెందు శిష్యాగ్రణీగరిమనెఱిగి
చల్లబడియాదవ గురుండు సాంత్వనమున ॥44॥

రావయ్యా రామానుజ !
యీవేదిక చెంతనిలచి యీ ప్సితమగు నీ
భావములన్ స్పష్టపరుపు
మా,విద్యాతురులగు చెలు లభినందింప ॥45॥

నావుడు శిష్యాగ్రణి భ
క్త్యా విష్టుండై ఘటించి యంజలి దేవా!
మీవాక్కుల, కెదురాడెడి
జీవుడనని తలపరేచెప్పెదనిందుః ॥46॥

మిమ్మెదిరించెడి పొండి
త్యమ్మున, కడకా తలంపు త్పటదుమది, బ్ర
హ్మమ్మున సత్యముజ్ఞానం
బిమ్ముగ నదియే యనంతమివిధర్మంబుల్ ॥47॥

బ్రహ్మమున జ్ఞానమే స్వయం ప్రభలవెలుగు
బ్రహ్మ మున సత్యమె వికారరహిత మది అ
నంత మై బ్రహ్మమున్నిట వ్యాప్తి చెందు
వేదవేతియున నిజ మేరీతి తెలియ ॥48॥

తళుకు, తావి, తేనె, తవిలిన సుకుమార
పుష్పము వలె బ్రహ్మమునకు మూడు
విడివడనిగుణములు వేర్వేరు భావమే
జీవలోకములని చెప్పె శ్రుతులు ॥49॥

వెలుగురవికి చల్లదనము సలిలమునకు
ఉష్ణమగ్నికి సహజమ్మైయుండురీతి
జ్ఞాన సత్యమనంతముల్ నైజమగుచు
బ్రహ్మ మపృథక్ గుణంబుల పరగుచుండ ॥50॥

బ్రహ్మ మందనేకపరస్పరమువిరుద్ధ
గుణములొకటకూటస్థమై కొఱతలేక
దేశకాలయుపాధుల - త్రెళ్ళునట్టి
సచ్చిదానంద తత్త్వమే సాధువగును ॥51॥

బ్రహ్మమందీత్రిగుణములు పదిలమయ్యె
కానిగుణముల బ్రహ్మంబుకానరాదు
బ్రహ్మమేవేరు గుణములప్రకృతివేరు
తలప జీవేశ్వరులకుభేదంబునిజము ॥52॥

నిర్గుణబ్రహ్మ మొక్కటే నిక్క మైన
ఎఱుక బయలు బుుతంబని మరల మూటి
నిచట వేర్వేరుగా వచియింపనేల?
బ్రహ్మమునకెట్లు పర్యాయపదములబ్బె? ॥53॥

నిర్వికార నిరంజన నిర్గుణమున
బ్రహ్మమున జగద్రూపము ప్రాప్తమగునె?
ప్రాప్తమందది నిర్గుణబ్రహ్మ[illegible]
[illegible]ానందముల్ [illegible] ॥54॥

ఆనందములోఁ బుట్టుచు
నానందములోఁ బెరుగుచు నానందములో
నానందంబగు లయ క
ల్యాణాద్భుతగాత్రచర్యబ్రహ్మంబనగా ॥55॥

యాదవుడావాక్కులఁ దా
సాదరముగనాలకించి సందేహములా
మోదంబగుకానీ,నీ
వాదములో చేవలేదు పరిశీలింపఁ ॥56॥

జ్ఞానమే సత్యమదియే అనంత మయ్యు
బ్రహ్మమై అవస్థా స్థితింబట్టి పెక్కు
పేళ్ళు జీవలక్ష్యార్థమై విశదమయ్యె
కాని నిర్గుణబ్రహ్మమొక్కటియెనిజము ॥57॥

గడియగడియకుమారుజగంబునందు
చచ్చిపుట్టుచు పుట్టుచుచచ్చు చున్న
జీవగుణములరూపమే స్థిరముకాదు
బ్రహ్మమునకీ వికారముల్ పట్టవయ్య ॥58॥

గుణము లుండిన, రూపంబుకూడుచుండు
రూపమబ్బిన మృత్యువేరూఢమగును
మృత్యువేలేనిరూపంబు సత్యమిదియె
జ్ఞానమైయనంతమయి యానందమగును ॥59॥

బ్రహ్మమున సచ్చిదానంద పరతనెగడె
నీడలేని చైతన్య మై వింతెబ్బుతము
మూనెలేని దీపంబునై జ్ఞానమొగయు
పొడవులేని ప్రాణంబుగా భువిని చుట్టు ॥60॥

ప్రాకృతపు సృష్టి సంస్థితి లయలు మిథ్య
జీవుడీ పై మెరుంగల చిక్కి నలుగు
జ్ఞానమేగుణంబులులేనిసత్యమయ్యు
యప్పుడే భేద ముడిగి బ్రహ్మంబవగుదు ॥61॥

చిన్నవాడవింకను చింతచేయుమన్న
అధ్యయనమడుగంటె విద్యార్థులమది
చెదరె రిత్త ప్రశ్నించుచు చిరుతలైరి
మంచిదేయని ముందుకు మరలె గురుడు ॥62॥

శిష్యులంతరామానుజా ఛీత్కరించి
పినితలతిక్క శంకలే వేచె మమ్ము
అపరశంకరుండగు గురుడాగ్రహించె
నేమికామన్నదోయని యొల్లరేగ ॥౬౩॥

అన్న! గురుడు, గుణాతీతు నెన్నుకానియె
నీవు కల్యాణగుణములనిలువుగంటి
సఖులివటుమత్సరమ్ము నజారుకొనిరి
దీనికివిచారమేటికోతెరలుమనగ ॥64॥

కాదుకాదుగోవింద శంకరులు బ్రహ్మ
మునుగుణాతీతమునఁ బరిపూర్ణమనిరి
యాదవులునిర్గుణమిది శూన్యమనివాద
బలము చూపిరి అనుభవంబందుకొనరు ॥65॥

ఏది యొట్లైన గురువుల నివుడు మన మి
చట ప్రసన్నాత్మచేసికొనుటయు, మేలు
అందఱమన్నా విధమువాడుకొనెడి
[illegible] ॥66॥

శంకాతంకమనము లి
ట్టింకులుగాన్‌భక్తి నిలచి రిర్వురుగురుపా
దాంకములందలచుచు నా
వంకకునాకస్మికముగ వచ్చెగురుండున్ ॥67॥

సోదరులిరువురు గురుదే
వా! దయమన్నింపుడంచుప్రణమిల్లగ లే
లే, దిగులేలచిరంజీ
వీ? దేవునిబిడ్డ వీవు హృదిహృదినెఱుగుః ॥68॥

ఆర్జితమగునీగుణముల
నూర్జితమగుభక్తి తత్త్వముదయించెన్; స
మ్మార్జితమగు నీశంకలు
తర్జనభర్జనలకింక తానముగలదే? ॥69॥

ఏరీ నీసహపాఠకు
లౌరా? సహనంబు; నెదిరినరసి డిగుణమున్
సారాసారమెరింగి వి
చారంబొనరించు శక్తి ఛాత్రులకె పుడో! ॥70॥

దేశాటన మొక్కటియే
యాశిష్యసఖాళికెల్లనింగితమనుచుః
కాశీయాత్రను చాటుం
డాశిపివిష్ణుని యనుగ్రహంబందుకొనః ॥71॥

భావభేదంబుకలిగినన్, భాషతెలియ
కున్న, శీతోష్ణములే మారు చున్న, తిండి
తీర్థములువేళవేళకు తీరకున్న,
బ్రతుకునడుపుటే యాత్రకు లక్ష్యసిద్ధి ॥72॥

అప్పటికిగాని శిష్యుల యాత్మ శక్తి
వెలుగులిడదన్న యాదవ విప్రుఁజూచి
అతనివాత్సల్యమెఱిగి రామానుజుండు
తీర్థయాత్రాకుతుహల దృష్టినడచె ॥73॥

# అధ్యాయము - 3

అహమహమని యాత్మకుదూరమ్మైగురుండు
బ్రహ్మదైత్యునిచే పరిభవముగాంచె
వినయవినమితశిష్యుడే విబుధుడయ్యె
అందరికిగాని విద్య హాస్యాస్పదంబు॥

# 3. వినయవిభూతి

పాపరాపాన్పునఁ బరుండు వరదుడగుదో?
గిరిశిఖరిపై నటించు నీశ్వరుడవో! ప
దాశ్రుతిస్వరూపుడగుపద్మన[illegible]వో!
నిన్నునెవరని, యెట్లునిర్ణయింతు? ॥1॥

తెలియనప్పు డేదియు మది తేటపడదు
తెలిసినప్పుడు భేదమే తెల్ల మగును
భేద మందున నిను జూచి బాధపడుచు
తెలిసి తెలియకనీముందు నలుగుచుంటి ॥2॥

నీలమేఘ సుస్నిగ్ధమో ! నిరుపమాన
తేజమో! నల్లకలువల తీయదనమొ
వల్లనయ్య నీసన్నిధానమున నిన్ను
నే వెఱుగకుండ నీగతి స్థాణువగుదు ॥3॥

దివ్యకాంతిస్వరూపముద్దీప్తమగుచు
కంటఁ బడుచున్నకల్యాణగాత్రువెటుల
ప్రాకృతశరీరధారిగాఁ బరిగణింతు?
బాహ్యనేత్రాలకందని ప్రభుతనీది ॥4॥

జననమరణము లున్న యీ తనువు నీది
క్షుత్పిపాసలుగల యీయసువులునీవి
శోక మోహాల కర్తృత్వసుకృతినీది
నీవు లేక ద్వంద్వంబులే లేవు జగతి [illegible]

ఈవులేకయీసౌందర్యమెటులఁకలుగు?
నీవులేకనిత్యత్వమునిలుచుటెటులో !
నీవు లేకయానందమున్నిటకలుగునె ?
నీవయీజీవజగముల నిలుపుశక్తి ॥6॥

కాలమునుగెల్చు దేహంబు కర్మములకు
కట్టువడనిచేష్టలు మదిగాంచుటెటులో !
సచ్చిదానందగుణముల స్వామిదివ్య
తత్త్వమేరీతి తెలియుటో తట్టదు మది ॥7॥

జ్ఞానసత్యమనంతాది సద్గుణములు
బ్రహ్మసంబంధియేగాని బ్రహ్మ మగునె?
ఎఱుఁగదేహదేహిన్యాయ మిది సహజము
నిన్నునీవాడుకొలువకనిలుచు టెటులో? ॥8॥

భువనమోహన రూపమే ముందునిలువ
అంతుకందని యేదో ! యాహ్లాదమొదవు
విగ్రహంబని నిన్నుభావింపలేను
రాతిరప్పుగనీముందు బ్రతుకలేను ॥9॥

ఎచటనోయున్న నన్ను నీయెడకులాగి
కనుల మిరుమిట్లు గొలుపగ కరుణఁజూచి
అమృతములుకు రాజీవ నేత్రాలదనిపి
నన్ను చూచిమూడక నవ్వ న్యాయమె? యువ ॥10॥

ఎవరిదీ వేదనయని మెట్లెక్కుచున్న
యామునాచార్యగురుడు శిష్యాళినడుగ
భక్తి మూర్తిభవించిన భాగవతుడు
యాదవులఁగెల్చు శ్రీరామానుజుడన ॥11॥

దవ్వుదవ్వులనుండియే తన్మయుడగు
భక్తునింగాంచి యాజానుబాహుడమృత
చిత్తుడరవింద నేత్రుడు స్నిగ్ధమూర్తి
కారణ పురుషుడైనను జగద్గురుండు ॥12॥

వరద! యీభాగవతుని కాపాడుమంచు
స్వామికిన్ మ్రొక్కి శ్రీరంగపట్టణంబు
చేరనెట్టులో ! యామున శ్రీగురుండు
ఆ పలుకులకాంచీపూర్ణుడాలకించి ॥13॥

భేదమోదాత్తహృదయసంకీర్ణుడగుచు
గురునివాక్కులమోఘమైకూడుకొనియె
నింతలోనెట్టి గండంబు లీకుమార
భక్తుడెదిరించునోయని బాధపడుచు ॥14॥

వరదునింజేరియామున వరుస తాను
"అయ్య! డాంబికగురులశిష్యత్వమెప్పు
డెటుల కడతేర్చు నో రామునెట్టులైన
బ్రోవవే"యని మరిమరిపూర్ణుడేగె ॥15॥

ఇంటికేగితల్లికెరగి యాత్రావిష
యంబుగురుని నిర్ణయంబుఁ దెలిపి
ఆమెదీవనగొని అనుజాడేతేర రా
మానుజుండుయాదవాంధ్రులంటె ॥16॥

ఇంతలోరాచభటువర్గమేగుదెంచి
దేవ! మీదర్శనముగోరె భూవిభుండు
బ్రహ్మరాక్షసి నగరిలోఁ బడికలంచె
పెళ్లికియుసిద్ధమయ్యె శ్రీపదములకన ॥17॥

యాదవప్రకాశుడాపల్కు లాలించి
చెంతనున్న శిష్యుఁజేరఁబిలిచి
రామ ! రమ్ము బ్రహ్మరాక్షసీ శక్తులు
మంత్ర తంత్ర విధులమర్మమెఱుఁగ ॥18॥

ఎక్కుమా పల్లకియన నీభృత్యునకిది
తగదు తగదు దేవా! మీపదముల వెంట
నంటి వత్తు సఖాళితో ననగ శిష్య
వరుని తిలకించి గురునాత్మ పరవశించె ॥19॥

గురుపల్లకి రాజాంతః
పురసన్నిధిజేర వచ్చి భూవరుడెదురై
గురుదేవా ! రక్షింపుడు
వరసుత నీదైత్యశక్తి బాధించె ననన్ ॥20॥

భయపడకో రాజ! జగ
త్త్రయమందెయపూర్వమంత్ర తంత్రాత్మక వి
స్మయశక్తులుగలవీ దు
ష్ట య ఘోరబ్రహ్మదైత్యుదగ్ధమొనర్తున్ ॥21॥

రాకుమారిపైగవిసిన బ్రహ్మదైత్యు
డుగ్రుడైతాండవింపగ నుర్వియదరె
పండ్లు పటపటకొఱకుచు పైఁబైఁబడ, గురు
డె వడురానీవు? రాకన్నెనేలపట్ట? ॥22॥

ఓరోరీ! యాదవ ! నే
నీరాజాత్మజనుగాక నీకాళులపై
వ్రాలెడిదుష్కర్మదురా
చారుడనే? చాలు నీదు శాస్త్రజ్ఞతయున్ । ॥23॥

నాకు తెలియని మంత్ర తంత్రములులేవు
ముష్టితోవెఱపింతువే మూర్ఖనన్ను!
నిన్ను నీవెతెలియని నిందితుడవీవు
నన్నుగూర్చి ప్రశ్నించుటనవ్వులాట ॥24॥

విన విను చెప్పెద గతజన్మనునేను
పరమ నిష్ఠాగరిష్ఠుడౌ బ్రాహ్మణుండ
సకల వేదవేదాంగాది శాస్త్రతతిని
జీర్ణమొనరించుకొన్న సంపూర్ణబలుడ ॥25॥

క్రతువునన్ స్వర లోపంబుకలుగ బ్రహ్మ
రాక్షసుండనై యిటుల నల్లాడు చుంటి
వెనుకజన్మన గృధ్రమై వృక్షశాఖ
యాత్రికుల భుక్తశేషాన్నమందితీవు ॥26॥

తత్ఫలమున విప్రాకృతిదాల్చితివన,
అద్భుతస్వాంతుడైతగ్గియాదవుండు
ఎవ్వరివరప్రభావాననీకుమారి
కిందుముక్తికల్గు నో! వచియింపుమనగ ॥27॥

ఎవడహంకారమమకార హీనుడగుచు
నీచరాచరాత్మక జగంబెల్లనీశ్వ
రస్వరూపంబుగఁ దలచిఁబ్రతుకువాడె
వాకునీకును ముక్తియొందఁజకు నిచ్చు ॥28॥

అట్టిమహనీయుడెవ్వడోయనగ నేమి
చెప్ప నాత్మప్రబోధమే చేకొనకిట
కన్నులుండియు గాంచవిగర్వమతుల
గాంచనమ్మ, రామానుజుఁగాంచి మ్రొక్క ॥29॥

యాదవునిదృష్టి శిష్యరామానుజాకడ
వ్రాల, నతడుముందుకువచ్చి బ్రహ్మమెల్ల
ప్రాణి కోటిని రక్షింపరాక్షసమిక
నిలుమనే? శ్రీహరీ కరుణింపుమనగ ॥30॥

ఎంతచల్లని పలుకెన్నాళ్ళకీచెవిన్
బడె, సమస్త వేదపంక్తులందు
పొందరాని హాయిపొందితిందు వసంత
సంధ్యలవిరివానజల్లులివియె ॥31॥

నేనుమీవలెకాలేను! గాని, స్వామిం
సన్నిధానమే అజ్ఞాతసౌఖ్యమొసగె
రమ్ము దేవ! మీపదమీశిరంబునంట
గుజ్జుకట్టునా గర్వపు మజ్జకరగు ॥32॥

మీ కృపాకటాక్షమే మేనుసోక నా
దైత్యలక్షణంబె తలగె వాస
నావశమగురూపునశియింపదయ్యోమీ
పాదధూళితగులబ్రహ్మమగుదు ॥33॥

కేలుమోడ్చిశిరమువంచి క్రిందవ్రాలు
దైత్యునిన్జూడజాలక తత్క్షణంబు
ముందు వడి నిజ పాదమాపుణ్యజుని
శిరముపైనిడివరద! రక్షింపుమనగ ॥34॥

హరిపదంబంటు బలిరీతి నాతడలరె
కన్నులంజెదర్చుకాంతియొక్కటితటుకున
మింటికెగయగ ముంగిట నంటుకొన్న
వృక్షశాఖహఠాత్తుగావిరిగి పడియె ॥35॥

వైటుసర్దుకొనుచు రాచపట్టి లోని
కురికె, నిట్టూర్పులప్పుడు భరమడంగె,
బ్రాహ్మణుడుగురుండు చిత్రమీమాంసియయ్యె
శుచిరుచిప్రభస్రామానుజుండునిలువ ॥36॥

బ్రహ్మదైత్యాదిపాపముల్పరిహరింప
భక్తియేగాని మంత్రముల్ పనికిరావు
నిర్మలాంతఃకరణులసత్కార్యమొకటె
పాపులసముద్ధరించెడి స్పర్శవేది ॥37॥

చిత్రమితని మహిమ చెప్పలేమంచు వే
నోళ్ళ విభుడుపొగడ, త్రుళ్ళుచుమది
వీడుమాకుశిష్య చూడామణి నృపాల!
యని వినవినగ్రహముకరిగెగురుడు ॥38॥

మణిమాణిక్యంబుల భూ
షణహారంబుల సువర్ణ సహితాంబర చం
దనతాంబూలంబుల ల
క్ష్మణున కిడి నమస్కరించుమనుజేశునితో ॥39॥

క్ష్మాపాలా! కామకలన
జేపట్టెడి గొప్పయేమి వేసితివయ్యా?
శ్రీపతికృపచే గురునా
జ్ఞాపాలన వడచుకొనెడి కడపటివాడన ॥40॥

గురుడే సాక్షాద్బ్రహ్మము
గురుడే పూజార్హుడైన గోవిందుడిలన
గురువచనశ్రవణంబే
తిరుమార్గంబని భజించు భటుకింకరుడన। ॥41॥

ఈగౌరవతాంబూలము
మాగురు దేవులకుఁబంపిమన్నింపుడటం
చాగుణనిధిరామానుజు
డేగగ, కవిగాయకగణమింగితుపొగడెన్ ॥42॥

భుజబలంబుతోరాజ్యాల పొందవచ్చు
శ్రద్ధతోనాల్గు వేదాలచదువవచ్చు
కాని బ్రహ్మంబునెఱుగ భక్తపదమొకటె
విశ్వసౌజన్య కారిగా విభుడెఱింగె ॥43॥

యాదవుడీవృత్తాంతము
సాదరముగనాలకించి సమరస భావం
బే దివ్యమనుచుదెలిపియు
నాదారిని నడువనైతి నహామాడింపన్ ॥44॥

మనసువిరులకంటెమధురమ్మై సుకుమార
మైరుచిరప్రపూర్ణమై ఫలించు
శిష్యునివిడలేక, చిక్కనిగర్వంబు
నడపలేకగురుడు, సుడులఁబడియె ॥45॥

మఱువకమదిలోసేవన్
దరి జేర్చిక శిష్యవరుని దవుదవ్వులకున్
పరువకరాత్రియె పగలై
గురుడుండియునుండకుండె గుణనిధియెదుటన్ ॥46॥

నీవినయమే మాకమూన శిక్ష
నీవిద్యా ప్రతిభయె నన్ విరధుఁ జేసె
నీవి భక్తి ప్రపత్తి నన్ వివశుఁ జేసె
కొఱుకరాని కొయ్యగ నీడుగుండె పిండె ॥47॥

తెగులు లేని యీబాధనుత్రెంచలేను
వీడుచున్ని కాదుకడకు విశ్వవిదిత
బ్రహ్మతత్త్వంబునే మార్చి ప్రజనపూర్వ
మాత్మ సిద్ధాంత కూపాన నూకివైచు ॥48॥

ఏదియెట్లుండి నన్ వీని యెదమధురము
ముఖముదివ్య కాంతుల సదాముద్దులొలుకు
చంపమనసొప్పదు భరింపశక్తిలేదు
ఏదొ, అజ్ఞాత శక్తియే యితనిఁ గాచు ॥49॥

పారదోలె పదస్పర్శ బ్రహ్మదైత్యు
ని, సహజ బ్రహ్మ తత్త్వమున్ నిలుపఁజూచె
జగతి హృదయమున్ దనిపె ప్రసన్నుడగుచు
వీని నిర్జింపలేను జీవింప లేను ॥50॥

ఇంతలో సోదర ద్వయంబే గుదెంచి
గురునికెఱగి దేవా, యాత్రకుతగువసతు
లన్నియునుగూడె నీక ఁదమ యాజ్ఞ యనగ
రామ! దేహ మనారోగ్య మైమతి చెడె ॥51॥

నీ వే శిష్యులతో కా
శీవిశ్వేశ్వరు భజించి చిరతర పుణ్య
శ్రీవిభవంబందుమ యన
దేవా! గురుముఖముగాని తీర్థము లేలా? ॥52॥

తను మనో ద్వయుంబిందు స్వస్థతను దప్పి
మీరలీరీతి వెతపడ మిమ్ము విడిచి
తీర్థయాత్రల కేగ చింతింపలేము
హరికినికరించి నపుడె సర్వార్థసిద్ధి ॥53॥

గురువే బ్రహ్మమువిష్ణువు
పరమేశ్వరుడీపదంబెభాగీరథిదే
శరణుశరణంబనినమ
స్కరించు రామానుజుఁగని కనులుచెమర్చ ॥54॥

వీనినడనుడిసత్యంబు వీనిముందు
నాప్రయత్నంబులేవియు నడువ వంచు
కలగి శిష్యులంజూచి వాక్యార్థమిందు
నడువ దీదేహమందున నలతనలమె ॥55॥

నాల్గైదువారంబులునడచినంత
మరల వాక్యార్థ మనగ రామానుజుండు
తప్పతక్కనశిష్యాళి తరలె కాళ
హస్తికింజేరెగోవిందుడభవుగొల్వ ॥56॥

రామ! యీమధ్య నీవు సర్వజ్ఞుడైన
శంకరులసూత్రభాష్యంబు చదివిరమ్ము
మనముసావకాశంబుగ మాటలాడ
వచ్చులే, యన కేల్మోడ్చి పలికె నతడె ॥57॥

బ్రహ్మతత్త్వనిరూపణ ప్రతిభమాడ
శంకరభగవత్పాదుల ప్రజ్ఞ తర్క
శక్తి యుపనిషత్జ్ఞానము సరళశయ్య
నాన్య తోలభ్యమంచుమన్ననము చెప్పె ॥58॥

కానియీజీవజగములగతినెఱుంగ
వారల ధ్యేయ మేమొ తత్వార్థ మెటులో!
తెలియఁజాలక మీపదంబుల భజింతు
దానుని యభీష్టమున్ దీర్చి దనుపుఁడనగ ॥59॥

జీవజగములురెండును స్థిరముకావు
మాయచేబ్రహ్మమందవిమనకుతోచు
మాయతొలగిన మెక్క బ్రహ్మంబెనిలుచు
మాయజ్ఞానమునఁబరిసమాప్తమగును ॥60॥

అంతసర్వమాబ్రహ్మమైయలరు నంచు
ఛాందమనగ క రోపనిషత్తుకూడ
భేదమంతయుమాయచే పెరుగు నంచు
'నేహానాస్తికించ ''ని నెఱపుననగ ॥61॥

దేవ! యిచటనే నాకుసందే హామొదవె
సర్వముఁబ్రహ్మమను సూక్తి సొంతమెఁఱుఁగ
నేరకే ముందుతజ్జలానీతిశాంత
మనుటచూడసిద్ధాంతమేవ్యత్యయమగు ॥62॥

నీటఁబుట్టినీటనే పెరుగుచు తుది
నీటనడగు చేపనియతి బ్రహ్మ
మందుఁబుట్టిబ్రహ్మమందు ఁబెరిగిబ్రహ్మ
మందడగుచరాచరాత్మకంబు ॥63॥

నీరువేరుచేపవేరిదేరీతిబ్ర
హ్మంబువేరువిశ్వమనగవేరు
కానినీరులేక మీనంబు లేనట్లు
బ్రహ్మరహితజగతి పరగదెందు ॥64॥

సంసరణవిషయంబుల సరణిచూడ
మణిగణంబులసూత్రసంబద్ధమైన
రీతికన్పట్టుమతి విచారింప బ్రహ్మ
సూత్రమున విషయంబుల సొగసులివియె ॥65॥

భిన్న భిన్న ప్రకృతులొప్పువిశ్వమెల్ల
బ్రహ్మసూత్రంబుచేకట్టుబడియొకటిగ
కంటబడుచుండ నిదిమాయకాదు, బ్రహ్మ
మన్నిటికి మూలసూత్రమై యలరుఁననగ ॥66॥

దానిచేబుట్టి దానిచేదనరి దాని
కన్యమైయుండ నేరమి అయ్యె నీవు
చెప్పు మత్స్యజలో పమ చేరదిందు
తజ్జలానీత బ్రహ్మకే తగునెఱుంగ ॥67॥

అహము బ్రహ్మమయ్యె ఆత్మబ్రహ్మంబయ్యె
నీవు బ్రహ్మమైతినిజ మెఱుంగ
జ్ఞానమొకటె బ్రహ్మమైనిండద్రష్టదృ
శ్యంబుదృక్కులీ త్రయంబు మించు ॥68॥

పూర్ణమునుగుణంబులముక్కముక్కలుగను
విఱచిచూచెడి నీనేర్పునెఱుగమెందు
భేదమందభేదముచూపువిధమునీది
నీకుమాకుపొసగదిక స్నేహవృత్తి ॥69॥

శంకరాద్వైతసిద్ధాంతసారమీవు
పూర్తిగాగ్రహించియుదానిపొత్తు విడక
కట్టుకొనకతుకులబొంతగావిచిత్ర
పటముకల్పించుకొను బ్రహ్మవాదివీవు ॥70॥

మేమునీశిష్యవృత్తిని మే పలేము
సర్వతంత్రస్వతంత్ర త సొగునీకు
అమరనారాయణానుగ్రహమగుగాక
యంచు దూరమైపోయెనాయాదవుండు ॥71॥

పిడుగు పడినట్లు రాగురుమడులున్న
దివ్యరామానుజుండు విశ్వేష్టుడయ్యె
కొన్నిగడియలకెట్టులో కుదుట (బడుము
అల్లవేళ్లమవీక్షించెవని లజగతి ॥72॥

# అధ్యాయము - 4

సేవలోఁగల సంతృప్తి చెలువ మౌర!
ఎన్ని జన్మలపుణ్యమో యెఱుగనంచు
శాస్త్రచర్చల త్యజియించి సకలమ్ము
తముగు హరిభక్తిలక్ష్మ ణతరుణుడలరె॥

# 4. సేవానురక్తి

స్పృష్టికర్తయెవడో ! జీవేశ్వరులతార
తమ్యమెంతో! ముక్తిదాతయెవడో!
భేదమందుప్రీతివిప్పారుటెట్టులో!
తెలుపువాడెవండో! తెలియుటెటులో? ॥1॥

కన్నతండ్రిగతించె గైకొన్నవేద
గురుడుమధ్యలో విడిచె, సోదరుడుదూర
మయ్యె, నోర్వ్పుటే నేరమయ్యెనాకు
హరిహరీ!భవల్లీలకు హద్దులేదె? ॥2॥

నారాయణుడే జ్యోతియు
నారాయణుడే పరంబు నారాయణుడా
త్మారాముడు నాలక్ష్మి
నారాయణుడే మమశరణంబనుసూక్తుల్ ॥3॥

మంత్ర పుష్పమ్మునాలించె మనసుదోచు
వేదవిదులకంఠస్వరంబే వినఁబడ
ప్రతిమయైనాద మీద్పెడిగతిపదంబు
సాగమంత్రరుద్ధ భుజంగ సరణి నిలిచె ॥4॥

వీనులకువిందుగూర్ప రామానుజుండు
పరుగుపరుగునవచ్చిదే వాలయమున
స్వామిసన్నిధినిలిచె వింజామరముల
వైచు భక్తులంజూచుచుఁ బరవశించె ॥5॥

వీరిసేవలోగలతృప్తి వీరిమోము
లందు చిందు మహానంద మందుటెటులొ?
ఎన్నిజన్మలు తపియింప నీసుఖంబు
కల్గునో?చదువులగర్వగంధినైతి ॥6॥

చాలయ్యా! చాలీగ్రం
థాలయముల్ తరచతేను వ్యర్థంబీ దీ
ర్ఘాలోచనములు బ్రతుకు వృ
థాలాపంబులచెడె వరదా! దయగనుమా! ॥7॥

దాసుడన్నై సేవించెద
నీసన్నిధి నిలువ నిమ్ము నీవాడను నే
నే సిరులాసింపను నీ
దాసులదాసుండనన్ను దయచూడుప్రభూ! ॥8॥

ద్వారముకడనిల్చివచ్చిపోయెడివారి
పాదధూళి నెత్తి పైనిడుకొని
కరము మోడ్చి నిలుచు కాంచిపూర్ణుగని రా
మానుజుండు దిగ్భ్రమతనిలువగ ॥9॥

ఈతనినిరహంకార ప్రకృతినిచూడ
శంభుడేమదిలోన సాక్షాత్కరించె
ఈమహాత్ముడే నన్నుగ్రహించె నేని
జన్మసార్థకమంచు నా చరణమంట ॥10॥

వలదు వలదు బ్రహ్మవాది! తక్కువ జాతి
వాడ నేను; యాదవ ప్రవరుల
క్షాత్రవరుడ నీవు, సంస్కారశిఖివి, న
మస్కరింప తగదు మాకుమీరు ॥11॥

లెమ్ములెమ్ము విప్రశ్రేష్ఠ! లెమ్మని వెస
రెండు చేతుల, నాతని లేవదీయు
కాంచిపూర్ణుని చూచుచుగద్గదస్వ
రమున లక్ష్మణుడు కడు సంభ్రమతబలికె ॥12॥

జ్ఞానగురువుల మెప్పింప లేని అలతి
భటుడ, గుణములే బ్రహ్మమై పరగు చుండ,
జాతిమతకులంబులనెటుస్మరణసేతు?
స్వామిసేవకు నుచ్చ నీచములులేవు ॥13॥

వేదవాదము లేల? కన్పింపనట్టి
బ్రహ్మమునకంటె, కనపడు భక్తుడె, గురు
డైన సార్థకం బౌను నాబ్రతుకుదేవ!
దీనునిదరిజేర్పుడని ప్రార్థింపనతడు ॥14॥

కారణ పురుషుడైపుట్టు జ్ఞానినీవు
నీకు గురుడనై లో కాపనింద మోయ
లేను, వరదుడాజ్ఞాపించురీతి నడతు
వలయుసేవల- స్వామినికొలువు మనగ ॥15॥

నేటినుండిమీరు పాటించు నీజలా
హరణసేవనాకుగురుపద మని
వరదుని అభిషేకజలములంగొల్వరా
మానుజా ద రుణోద యానలేచు ॥16॥

చేమవగల కొలను జేరి జలకమాడి
వార్చి మడుగుగట్టి పాత్రశుద్ధి
జేసి చుట్ట వెట్టి శిరముపై జలకల
శంబుతోడవచ్చు స్వామిగొలువ ॥17॥

నేలనంటిన కందుపాదాలవాడు
యాదప గురుండె మెచ్చు శిష్యాగ్రణే,నృప
సేవలంగొన్నభూసుర శ్రేష్టుడకట!
కుండబట్టి కోమటివెంట గుడికి నడచె ॥18॥

పిచ్చివాడనికొందరు ప్రేలుచుండ
బడుగువాడనికొందరు పరిహరింప
నెన్నివిద్యలునేర్చిన నేమి ఫలము?
బ్రతుక లేని వాడనిప్రజవాగు చుండె ॥19॥

ఇంకనేమేమి ఘోరంబులెదుటఁబడునొ?
యీకలిప్రభావంబునూహింపమంచు
స్వామి సదనంబు కేతెంచు జనముదిన
మలత నిట్టూర్పులఁబడె రామానుజుఁగని ॥20॥

లోకమ్మునులెక్కింపడు
ప్రాకటమగుమంచిచెడ్డలనుస్థితిగతులన్
జేకొనడాత్మీయువు నే
వాకర్తవ్యమున మనసు పదరకనిల్పెఁ ॥21॥

గడియబిడువు చిక్క కాంచి పూర్ణుని ఁజేరి
భక్తులమహిమవిని పరవశించు
కనులనీరుక్రమ్మ కరివరదాయని
ఉస్సురుస్సురంచునూర్పులవిడు ॥22॥

ఒక్కనాడుకాంచీపూర్ణుడుల్లముల్ల
సిల్లి! అయ్య, రామానుజా! చిత్తగింపు
రంగపురిలోన రతనాలరానులుండె
నిర్మల మనస్కులకివికల్పించునంట ॥23॥

కథలమర్మంబుదెలిసిన జ్ఞానివీవు
జగతిలక్ష్యంబువెరిగిన స్వామివీవు
ఆత్మసౌందర్యమెఱుగు ధరామరుడవు
నీకుయామునాచార్యులానిధులఁజూపు ॥24॥

అతడురంగనాథునికనులారగన్న
దివ్యమూర్తి నీప్రగతి గుర్తించు భవ్య
పురుషుడాత్మవిద్యా పరిపూర్ణుడాళ
వందనారులదర్శింప భాగ్యమనగ ॥25॥

ఇంటగలయీమహాత్మనే యెఱుగనైతి
నీపదరజః కణమెధరియింపనైతి
నెక్కడో యున్నవేల్పునాకేటికంచు
వేడినిట్టార్పులాతడువిడుచుటెఱిఁగి ॥26॥

రామా!, నీయావేదన
క్షేమో! యదితీరుమార్గమెటులో? వరద
స్వామియె వినిపించు వెస
నామాటలు నమ్ముమాత్మనలుగకుమనగా ॥27॥

ఎపుడో యదిసిద్ధించుట
యిపుడీ భక్తవరుడింటకేతేరగృహం
బుపవిత్రమౌ ప్రసాదా
ప్తి పేదల బతుకు పరమార్థవిభవంబగు నా ॥28॥

యామునాచార్యుడూహించినట్టిగుణము
లితనిచర్యల స్పష్టమై తముగూర్చి
కల్లకపటమేలేని వాక్యంబుల మది
కట్టువాడె, వరదుడె నమ్మకలచెవంచు ॥29॥

ఎదకరుగ(స్రవించునెదిరికన్నులచూచి
పూర్ణుడుకరుణా(ప్రపూర్ణపూదివి
అయ్యా! వత్స, మీగృహా(ప్రసాదంబు సే
కొందు,స్వామి పొందు పొందెద నన ॥30॥

అవగింజపైమహాంభోధిపడినట్టు
లాతనిహృదయంబె యవశమయ్యె
పూర్ణుపాదములకు(మ్రొక్కి,తూర్ణంబున
గంతులిడిగృహిణీముఖంబుసూచె ॥31॥

ఇంటి కింద నారాయణుం డేగుదెంచు
అతనిభుక్తశేషము మనకందరికిని
ముక్తి ష్రదసో పేతమౌభోజనంబు
సిద్ధ మొనరింపుమా సేవ సేసివత్తు ॥32॥

వరదుకైంకర్యమొనరించి, వచ్చియింట
వంటకంబుల గమగమపరిమళాల
దెలిసి, భాగవత(శే ష్ఠుబిలువ(బోయి
తాళబద్ధపూర్ణాలయద్వారమరసి ॥33॥

దీనుడై యింటి కాతండుతిరిగి రాగ
ని ప్పుడే కాంచిపూర్ణులీయెడకువచ్చి
స్వామిపంపగ వచ్చితి సత్వరముగ
వంటవడ్డింపుడని నన్ను వేగిరింప ॥34॥

ఆలసించిన వరదుడే ఆ(గహించు
దేవకార్యముదీర్చ నేపోవలెనన
చెప్పినట్లునేజేయభుజించియతడె
ఆకుదీసి శుద్ధి యొనర్చియవలికేగ ॥35॥

పెరటియావుకు శేషాన్న భిక్షనిడితి
క్షణములో వండివడ్డింతుననుసతిగని
పిలిచి భక్తులభంగించు ఖలుడనంచు
నవ్వుచుపతి, విధివిలాస మెవ్వ డెఱుఁగు? ॥36॥

చేతికందియు నోటికిచిక్కదాయె
నెదుటనిల్చినలక్ష్మినే యెఱుగనైతి
హరికృపకుదూరమైపోతి పెరటి సురభి
నైనదర్శింపఁదగునని యాతడురికె ॥37॥

మాటిమాటికి మ్రొక్కిగోమాత! ఎంత
పుణ్యమో! నీది పూర్ణుల భుక్తశేష
మమృత ధారలై యందరకంద నిచ్చి
సకల జగములకాదర్శజననివైతి ॥38॥

కాంచిపూర్ణుడే మనయింటికడపత్రొక్క
ఎంగిలాకులాతని చేతనెత్తఁజేయు
పాపినైతి క్షమింపడావరదుడంచు
ఆలయద్వార కక్ష్యలకాత డురికె ॥39॥

ఎదుటఁబడుకాంచిపూర్ణుల పదముల ఁబడీ
దేవ! అపరాధినైతి నే ఁదెలిసితెలిసి
మీమతినడువనైతి క్షమింపుడంచు
వగచు రామానుజుంజూచిబలికెనతడు ॥40॥

అన్న! దుఃఖింప నేటికో? అన్నపూర్ణ
నిర్మలాంతః కరణ, జాణ, పీసతీమ
తల్లిచేతి దివ్యప్రసాదంబులిప్తి
నారగించితి బ్రతుకు సౌఖ్యంబుగంటి ॥41॥

భక్తితో కూడు జ్ఞానమె బ్రతుకుపంట
తరతరాలుగవచ్చు స్వధర్మము విడ
రాదు ఛాందసంబంచు పరాత్పర మది
సాంప్రదాయపుమర్యాదజార్పలేము ॥42॥

నీవే నేనను భావము
జీవులకున్ జ్ఞానసిద్ధి చే గల్గు సదా
నీవే గురుడనిదేవుని
సేవింపగభక్తుడమృత సిద్ధింబొందు౯ ॥43॥

భేదమెంత సత్యంబొ! అభేద మంత
నిత్యమగు శ్రీనివాసుడన్నిటికి సాక్షి
ఆచరించిచూపెడి ఆమహాత్ముడొజ్ఞ
శాస్త్రసంజీవినీ శక్తి జగతిరక్ష ॥44॥

మధురమై ప్రేమపూరితమై పరస్ప
రానురాగ సంభరిత మై త్యాగబద్ధ
భక్తి భావమే చైతన్య భాజనం బ
హంబభేదాన నేకాకియై యడంచు ॥45॥

చివరకున్నదంచు చెప్పువాడుండ డ
న్నియును వరదు డంచు నియతినిల్వ
భేదమం దభేదమే దర్శనం బై య
నంత సౌఖ్య మిందె యను భ వించు ॥46॥

# అధ్యాయము - 5

కాయకష్టోప జీవి రంగపురిఁజేరి
ఆసలడియాసలైపోవ; నాత్మవిదుని
స్పర్శ మాత్ర లో ముమ్మొదుల్ వదల ఁగావె
దివ్య తత్త్వము చాట ప్రతిజ్ఞఁబూనె ॥

# 5. ప్రతిజ్ఞ

బండబారిన బౌద్ధము ప్రయ్య, శంక
రుల మహామనీష మెరయు రుచితరోగ్ర
తార్కికజ్వాల చూచి, యాదవుల కనులు
చెదరనేగాని ,యాస్వామి హృదినెఱుగడు ॥1॥

సుమముకంటె పరమపేశలమగునామ
హాత్ముని రసార్ద్ర చిత్తంబునందడంగు
జాహ్నవీ పయః కణముల సారమనుభ
వింపవలెగాని మథియింప విషముపుట్టు ॥2॥

త్యాగమైె తన్య శక్తులయోగమందు
నిత్య సత్య స్వరూపుడై నిర్మలుడగు
శంకరభగవత్పాదు సర్వంక షప్ర
భుత్వమల్పజ్ఞు డేరీతి బొందనేర్చు ॥3॥

యాదవస్మృతి హరిసేవ నణగిపోయె
నాటినాప్రార్థన ఫలించె నాకె కాదు
అందఱకు నన్ని వేళల హాయిగూర్చు
రామునింజూడ; నాశతోయామునుండు ॥4॥

చెంతగలమహాపూర్ణుని చేరబిలిచి
నాథముని తాత పాదుల నాటినిధుల
రక్షసేయ రామానుజ ప్రవరుడొకడె
దిట్టయాతని కీవార్తదెలిపి, నీవు ॥5॥

వెంటనే పిల్చుకొని రమ్ము వెడలుమనగ
ఆజ్ఞయని మహాపూర్ణుడహరహము వయ
నించి, వరదరాజస్వామినేతలచుచు
కంచిచేరి, కాంచీపూర్ణుఁగాంచి, మ్రొక్కె ॥6॥

ఉన్నదున్నట్టు లీరీతియూడి పడితి
సేవమే మన యామున శ్రీగురులకు,
అంగరంగభోగంబులారంగనికి, య
థాప్రకారంబుచెల్లుగదాయనంగ ॥7॥

స్వామిసేవ కిందాకలోపంబు లేదు;
ముందుకెట్టులో యనుచింత; ముదిమి, గవియ
క్రుంగదీసెను యామున గురువతంను
నిచ్చటస్థితిగతులింక నెట్టు లొ? యన ॥8॥

మనరామానుజుడిట ని
ర్గుణ శృంగికి యాదవునకు కొఱకుడువడకే
అనుదినముజలాహరణం
బొనరించుచు భక్తి వరదునుల్లముదోచెన్ ॥9॥

అంతెకాదు యాదవ బంధ మతనికి తెగె
బ్రాహ్మణాద్య హంకారముల్ పట్టువతని
అహము దాసోహ మై కాయకంబునపడి
వరదునర్చించ సేవించు భాగవతుల ॥10॥

విని మహాపూర్ణువదనంబు విచ్చె, కనులు
వెడదలయ్యె మహాత్ములునుడులు సత్య
మయ్యెశంకయేలేదు, రామానుజాడిక
రంగవిధులకు శాశ్వత రక్షకుడ్వన ॥11॥

ఏ మేమీ! యామునులే
రామానుజారంగపురికి రమ్మనిరే, యీ
శ్రీమద్వైష్ణవ ధర్మం
బీమహి దీపించుసమయ మేతెంచెనొకో! ॥12॥

ఎగిరియెగిరిగంతుల్వైచునెదుటనున్న
పూర్ణుకౌ గిటబంధించు ముందువిన్న
గురునుడుల మఱిమఱి వినగోరు, కాంచి
పూర్ణు ఁగని, మహాపూర్ణుడు పూర్ణ మతిని ॥13॥

సతమువరదరాజస్వామి నతినుతిగల
నిన్నాయింతగామురిపింప నేర్చిన మహా
నీయుడాతడెట్లుండునో నేడె చూడ
వలెననెడి గురుభక్తుని పాఱఁజూచి ॥14॥

చూపింతుకారణ పురుషు
రేపే నిశ్చింతగ నిదురింపుమ! యని కాం
చీపూర్ణుడు శయనించె, మ
హాపూర్ణుడు గురుని మహిమ నాత్మదలచుచున్ ॥15॥

వఱువాతలేచి వరదుని
స్మరియించుచుమనమలరగ చల్లనిమలయా
నిలములె వైబడ నిరువురు
పరిమళపద్మాకరమును ఁబరికించిరటన్ ॥16॥

పక్షులకలకలము, దినప్రభువిరాక
దెలుప, పదనఖప్రభలు ప్రాగ్దిశకు పార
చుక్కలు మలికొండగుహలఁజొరబడంగ
సరసిబుడబుడన్వడి స్పష్టమయ్యె ॥17॥

జలకమాడగకల్గిన సవ్వడియిది
ది వృద్ధీతడే యామునో దృష్టమూర్తి
చూడుమాయని చాటుగా చూపి కాంచి
పూర్ణుడు వరదు గొల్వమున్మునదుకురికె ॥18॥

కంచికేకాదు నిఖిల ప్రపంచమునకు
వరద! వరదుడై వెలుగొంద వైష్ణవ ప్ర
బోధమగునట్లు రక్షింపు మో, ప్రసన్న
సుందరాంగురామానుజా సూరినవగ ॥19॥

వరదుని విశాలనే త్రాలకరుణతో ణీకె
కంఠమందున్న పుష్పమ్ము గ్రక్కునబడె
కాంచిపూర్ణునిమేన పుల్కలుజనించె
నిటమహాపూర్ణుడు సరసీతటమునందు ॥20॥

స్నానమాచరించి, సంధ్యవార్చి, సవితృ
మండలస్థహరికి, సమస్కరించి,
తడిమడుగు నడితలనిడి నిండుకుండ; సం
క్రాంతిదాసరివలె కదలివచ్చె ॥21॥

ఆమహోన్నతునట కనులార (జూచి
యితనిచేతలాళ్వరులనెదుటనిలిపె
ఈశిరఃకలశ మజాండమెత్తి పట్టు
శేషఫణిఫణారత్నమై సేవ్యమయ్యె ॥22॥

దైన్యమీచూపు లెవరినో తరుచు చుండె
నమ్రభక్తి, యజ్ఞాతసౌందర్యమంద
జేసె, విశ్వగురుండని చెప్పె నాళ్మ
అమ్మ హాపూర్ణునానంద మనథిదాట ॥23॥

ఏ మేమీ! యామునులే
రామానుజారంగపురికి రమ్మనిరే, యీ
శ్రీమద్వైష్ణవ ధర్మం
బీమహి దీపించుసమయ మేతెంచెనొకో! ॥12॥

ఎగిరియెగిరిగంతులువైచునెదుటనున్న
పూర్ణుకౌ గిటబంధించు ముందువిన్న
గురునుడుల మఱిమఱి వినగోరు, కాంచి
పూర్ణు (గని, మహాపూర్ణుడు పూర్ణ మతిని ॥13॥

సతమువరదరాజస్వామి నతినుతిగల
నిన్నెయింతగామురిపింప నేర్చిన మహ
నీయుడాతడెట్లుండునో నేడె చూడ
వలెనెనెడి గురుభక్తుని పాఱ(జూచి ॥14॥

చూపింతుకారణ పురుషు
రేపే నిశ్చింతగ నిదురింపుమ! యని కాం
చీపూర్ణుడు శయనించె, మ
హాపూర్ణుడు గురుని మహిమ నాత్మదలచుచు(౯ ॥15॥

వఱువాతలేచి వరదుని
స్మరియించుచుమనమలరగ చల్లనిమలయా
నిలములె పైబడ నిరువురు
పరిమళపద్మాకరమును (బరికించిరట(౯ ॥16॥

పక్షులకలకలము, దివప్రభువిరాక
దెలుప, పదనఖప్రభలు ప్రాగ్దిశకు పార
చుక్కలు మలికొండగుహల(దొరబడంగ
సరసిబుడబుడనవ్వడి వృష్టమయ్యె ॥17॥

జలకమాడగకల్గిన సవ్వడియిది
ది వృడీతడే యామునో ద్దిష్టమూర్తి
చూడుమాయని చాటుగా చూపి కాంచి
పూర్ణుడు వరదు గొల్వముమ్ముందుకురికె ॥18॥

కంచికేకాదు నిఖిల ప్రపంచమునకు
వరద! వరదుడై వెలుగొంద వైష్ణవ ప్ర
బోధమగునట్లు రక్షింపు మో, ప్రసన్న
సుందరాంగురామానుజ సూరినవగ ॥19॥

వరదుని విశాలనే త్రాలకరుణతో ణికె
కంఠమందున్న పుష్పమ్ము గ్రక్కునబడె
కాంచిపూర్ణునిమేన పుల్కలుజనించె
నిటమహాపూర్ణుడు సరసీతటమునందు ॥20॥

స్నానమాచరించి, సంధ్యవార్చి, సవితృ
మండలన్నహరికి, సమస్కరించి,
తడిమడుగు నడితలనిడి నిండుకుండ; సం
క్రాంతిదాసరివలె కదలివచ్చి ॥21॥

ఆమహోన్నతునట కనులార (జూచి
యితనిచేతలాళ్వారులనెదుటనిలిపె
తఃశిరఃకలశ మజాండమెత్తి పట్టు
శేషఫణిపణారత్నమై సేవ్యమయ్యె ॥22॥

దైన్యమీచూపు లెవరినో తరుచు చుండె
నమ్రభక్తి, యజ్ఞాతసౌందర్యమంద
జేసి, విశ్వగురుండని చెప్పె నాత్మ
అమ్మ హాపూర్ణునానంద మవధిదాట ॥23॥

ఆళవందవారుల కను మైన అమృత
పుత్రు డీతడే యాపీఠ మునకు మత్త
రాధికా రియి తడె యని ప్రజ నుతింప
ఏటిలో శుచి స్నాతుడై యెగబడంగ ॥48॥

రంగనాథుని దర్శింపరావె రామ!
యనుమహాపూర్ణుజాచి క్రోధాత్ముడగుచు
నాగురుని నాకు చూపక నాచుకొనిన
కర్కశుని చూడలేనంచు కంచికేగె ॥49॥

ఆగమోక్త ప్రకారంబు యామునులకు
ఖననకార్యంబు ముగిసె భక్త తతిబాష్ప
జలము లురికెడి నదికి వెచ్చదనమిచ్చె
కల్పవృక్షి తాగదలక కదలు చుండె ॥50॥

గురుడు గురుశక్తి గురుతపోబలము కడకు
గురుని తనువునే నిల్పక కూల్చివైచె
నాదినాశక్తులనుమాటనవ్వులాట
స్వేచ్ఛయేలేదు జీవికి జీవితాన ॥51॥

సూర్యచంద్ర నక్షత్ర సంశోభితమగు
గగనము చరాచరంబగు జగముతుదకు
ప్రకృతి కూడ తనంతతా బ్రతుకకాదు
జీవజగములరెంటికిన్ స్వేచ్ఛ లేదు ॥52॥

రెంటిని నడపించుకంట బడక; బుద్ధి
కందరాక రంగడాడుచుండె
సృష్టిజేసి పెంచి చివరకు చిటికెలో
మమ్ము త్రుంచు నేటిబొమ్మలాట? ॥53॥

నీకు చెలగాటమౌగాని మాకు ప్రాణ
సంకటము దేవ! తత్త్వ విచార మిప్పు
డాత్మకంటదు రాతిగానైన నన్ను
పుట్టనిచ్చిన నీ బాధ పట్టకుండె ॥54॥

నమ్మి సేవింప పూజింప నయననుంద
రముగదినదినము కులుకు రంగడె నను
చేరఁ బిలిచి నట్టేటిలో జారవిడిచె
నింకనెవరితో నేమని యేడ్వగలను? ॥55॥

మౌనిమ్మైయిల్లు వీడి రామానుజుండు
మఱిమఱిమది యామున గురున్ స్మరణసేయ
తట్టుకొనగాకొకకొలని గట్టుచేరి
రాలవిసరుచుజలతరంగాలమునిగె ॥56॥

యామునాచార్యుడువికుంఠధాముడయ్యె
మాన సోద్వేగి యౌచు రామానుజుండు
యింటికేతెంచె నని వింటి కంటబడడు
వరద! నీభక్తు నీరీతి వదల దగునె? ॥57॥

ఆ హృదయమతికోమలంబన్యుల పరి
తాపముఁవిన లేని యార్ద్రస్వభావ
మకట యిప్పుడే మయ్యెనో! యనితపించి
కాంచిపూర్ణుడు గాలించె క ంచినెల్ల ॥58॥

దరులదన్ను నాకోనేటి సరసినరుసి
చరమ సూర్యనారాయణస్వామికెఱఁగి
బాష్పతర్పణంబొనరించె భక్తుడంచు
పూర్ణుడలనల్లచేరి ముమ్మొడుమిలువ ॥59॥

ఆళవందనారుల కను మైన అమృత
పుత్రు డీలడే యాపీఠ మునకు నుత్త
రాధికా రియి తడె యని ప్రజ నుతింప
ఏటిలో శుచి స్నాతుడై యెగబడంగ ॥48॥

రంగనాథుని దర్శింపరావె రామ!
యనుమహాపూర్ణుజూచి క్రోధాత్ముడగుచు
నాగురుని నాకు చూపక నాచుకొనిన
కర్కశుని చూడలేనంచు కంచికేగె ॥49॥

ఆగమోక్త ప్రకారంబు యామునులకు
ఖననకార్యంబు ముగిసె భక్త తతిబాష్ప
జలము లురికెడి నదికి వెచ్చదనమిచ్చె
కర్మసాక్షి తాగదలక కదలు చుండె ॥50॥

గురుడు గురుశక్తి గురుతపోబలము కడకు
గురుని తనువునే నిల్పక కూల్చివైచె
నాదినాశక్తులనుమాటనవ్వులాట
స్వేచ్ఛయేలేదు జీవికి జీవితాన ॥51॥

సూర్యచంద్ర నక్షత్ర సంశోభితమగు
గగనము చరాచరంబగు జగముతుదకు
ప్రకృతి కూడ తనంతతా బ్రతుకకాదు
జీవజగములరెంటికిన్ స్వేచ్ఛ లేదు ॥52॥

రెంటిని నడపించుకంట బడక; బుద్ధి
కందరాక రంగడాడుచుండె
సృష్టిఁజేసి పెంచి చివరకు చిటికెలో
మమ్ము త్రుంచు నేటిబొమ్మలాట? ॥53॥

నీకు చెలగాటమౌగాని మాకు ప్రాణ
సంకటము దేవ! తత్త్వ విచార మిప్పు
డాత్మకంటదు రాతిగానైన నన్ను
పుట్టనిచ్చిన నీ బాధ పట్టకుండె ॥54॥

నమ్మి సేవింప పూజింప నయనసుంద
రముగదినదినము కులుకు రంగడె నను
చేరఁ బిలిచి నట్టేటిలో జారవిడిచె
నింకనెవరితో నేమని యేడ్వగలము? ॥55॥

మౌనియైయిల్లు వీడి రామానుజుండు
మఱిమఱిమది యామున గురున్ స్మరణసేయ
తట్టుకొనగాకొకకొలవి గట్టుజేరి
రాలవిసరుచుజలతరంగాలమునిగె ॥56॥

యామునాచార్యుడువికుంఠధాముడయ్యె
మాన సోద్వేగి యౌచు రామానుజుండు
యింటికేతెంచె నని వింటి కంటబడడు
వరద! నీభక్తు నీరీతి వదల ఁదగునె? ॥57॥

ఆ హృదయమతికోమలంబన్యుల పరి
తాపమున్విన లేని యార్ద్రస్వభావ
మకట యిప్పుడే మయ్యెనో! యనితపించి
కాంచిపూర్ణుడు గాలించె క ంచినెల్ల ॥58॥

దరులదన్ను నాకోనేటి సరసివరసి
చరమ నూర్యనారాయణస్వామికెఱగి
బాష్పతర్పణంబొనరించె భక్తుడంచు
పూర్ణుడలనల్లచేరి మున్ముందునిలువ ॥59॥

శూన్యదృక్కులం యామున జ్యోతి యకట
మాట రాక లేగవలె, యంబాయటంచు
పూర్ణపాదాల పైఁ బడి బోరనవిల
పింపనాత్మీయునెదఁజేర్చి ప్రీతి నతడు ॥60॥

ముంగురులుదువ్వి కన్నీరు పోదుడుచుచు
వెన్నునిమిరి రామానుజా! వెఱవకయ్య?
కర్మబంధమ్ములెంతటివార్కైన
అనుభవింపక దప్పదీయవనిలోన ॥61॥

వింటివయ్య! సర్వంబును కంటివయ్య!
పరమకల్యాణమూర్తి! నీపంతమేమొ!
అస్తమించెడి రవిగూర్చియడలనేల?
పుట్టుపూర్ణేందు చూడగముందు బడుమ! ॥62॥

ప్రకృతిబంధమ్ములున్నంతవరకు ప్రాణి
చావుపుట్టువులకు చిక్కి సతమతమగు
అమృతబంధానజగతికల్యాణమగుట
హరికృపాకటాక్షమని ధృడాత్ముడలరు ॥63॥

యామునశరీర మీస్పష్టినడగి పోయె ;
అతనియాత్మ సర్వాత్మకే యంకితమగు
తెలిసి తెలియకేయిటులీవునలగదగునె?
కలసి కట్టుగా శ్రమియింప కలదుసుఖము ॥64॥

బ్రహ్మతత్త్వంబుదెలిసిన బ్రాహ్మణుడవు
పామరులతీర్చి దిద్దెడి పండితుడవు
నీకుబోధించువాడనే నిక్కమెఱుఁగ
జీవజగములన్నియు హరిచింతనడుము ॥65॥

సేవలో నిరహంకారచిత్తమలరు
మననమున మహత్తరమహిమలు జనించు
ఆత్మలో చిదానందంబు ననుభవింతు
అమృతబంధాన హరిపదంబందవచ్చు ॥66॥

లెమ్ము కర్తవ్యనిష్ఠ కార్యమ్ముదీర్చి
యామునుల మనోభీష్టమ్ము నోముమనగ
వంతమాత్మలో మెదల నాపదములంటి
కాంచిపూర్ణునితో తానుకంచి చేరి జొచ్చె ॥67॥

యామునాచార్య సంకల్ప మద్భుతముగ
ఆత్మదీపింపవరదుని ఆలయాన
కరుగుదెంచి పరువున దేవా! క్షమింపు
మంచు హరిసేవ సర్వంబు నతడుమఱచె ॥68॥

శూన్యదృక్కులం యామున జ్యోతి యకట
మాట రాక లేగవలె, యంబా యటంచు
పూర్ణపాదాల పైఁ బడి బోరునవిల
పింపనాత్మీయునెదఁజేర్చి ప్రీతి నతడు ॥60॥

ముంగురులుదువ్వి కన్నీరు పోదుడుచుచు
వెన్నునిమిరి రామానుజా! వెఱవకయ్య?
కర్మబంధమ్ములెంతటివారికైన
అనుభవింపక దప్పదీయవనిలోన ॥61॥

వింటినయ్య! సర్వంబును కంటినయ్య!
పరమకల్యాణమూర్తి! నీవంతమేమొ!
అస్తమించెడి రవిగూర్చియడలనేల?
పుట్టుపూర్ణేందు చూడగముందు బడుమ! ॥62॥

ప్రకృతిబంధమ్ములున్నంతవరకు ప్రాణి
చావుపుట్టువులకు చిక్కి సతమతమగు
అమృతబంధానజగతికల్యాణమగుట
హరికృపాకటాక్షమని ధృడాత్ముడలరు ॥63॥

యామునశరీర మీస్సృష్టినడగి పోయె ;
అతనియాత్మ సర్వాత్మకే యంకితమగు
తెలిసి తెలియకేయిటులీవునలగదగునె?
కలసి కట్టుగా శ్రమియింప కలదుసుఖము ॥64॥

బ్రహ్మతత్త్వంబుదెలిసిన బ్రాహ్మణుడవు
పామరులతీర్చి దిద్దెడి పండితుడవు
నీకుబోధించువాడవే నిక్కమెఱుఁగ
జీవజగములన్నియు హరిచింతనడుము ॥65॥

సేవలో నిరహంకారచిత్తమలరు
మననమున మహత్తరమహిమలు జనించు
ఆత్మలో చిదానందంబు ననుభవింతు
అమృతబంధాన హరిపదంబందవచ్చు ॥66॥

లెమ్ము కర్తవ్యనిష్ఠ కార్యమ్ముదీర్చి
యామునుల మనోభీష్టమ్ము నోముమనగ
పంతమాత్మలో మెదల నాపదములంటి
కాంచిపూర్ణునితో తానుకంచి (జొచె ॥67॥

యామునాచార్య సంకల్ప మద్భుతముగ
ఆత్మదీపింపవరదుని ఆలయాన
కరుగుదెంచి పరువున దేవా! క్షమింపు
మంచు హరిసేవ సర్వంబు నతడుమఱచె ॥68॥

నామనంబునెప్పుడునలిపెడి తాత్త్విక
ప్రశ్నలకిటుతగుజవాబువచ్చె
నడవనివరదుండె నన్నిటనడిపించె
పలుక నట్టిప్రభుడె పలికెనిపుడు ॥18॥

వరదకైంకర్య మిందు సాఫల్యమందె
స్వామివాద్దేవి మద్గురువరుని చూపె
శిష్య సాధనకాత్మ బలంబు నీవ
యనగ పూర్ణుడాలీని కను లార జూచి ॥19॥

యామునాచార్య పీఠంబునధివసింప
పుట్టినమహాత్ముడవు మ హాపూర్ణగురుడె
నిన్ను శంఖ చక్రాంకితనియతుఁజేయు
ననగ గుడిలోని ఘంటలేగణగణమనె ॥20॥

యామునులులేని కొఱతశిష్యాళినలమె
రంగపురినెల్లకలచె శ్రీరంగనాథు
సన్నిధానమేయీ ంత్రక సరణినడచె
జీవజగములురెంచెను చేవదప్పె ॥21॥

ఎప్పుడెప్పుడేసేవ యెట్లెట్లుజరుగ
వలెనో! యటులనే స్వామికి జరుగుకాని
బ్రతుకులోరక్తి సేవలో శ్రద్ధతరిగె
శిష్యులీలోటుదీర్పకాంక్షిపరంత ॥22॥

రామానుజాడొకడెగురువు
యామునహృదయాభిరాముడందరి యెదకే
ప్రేమాంకురమాగమనిగ
మామృతమేఘము నిరంతరాంతర్ముఖుడౌ ॥23॥

మనసుదెలిసి ధర్మమార్గంబు చూపు సం
ఘమును హరిపథంబుకడకుత్రిప్పు
శక్తి సంస్కృతిగల సమయోచితప్రాజ్ఞు
డతడె నేడుమనకు నాత్మరక్ష ॥25॥

యామునులమనం బాద్యంతమాత్మనెరిగి
యతని తత్త్వంబు సాధింప ప్రతినబూనె
నిత్యసత్యవ్రతుడు సదా నిర్మలాత్ము
డతని వెట్లులై న నిటజేర్చుటందఱుగుటి ॥26॥

గురుభక్తికలదు కానీ
గురుపీఠము నధివసింప కూరునా! లేదో
పరమార్థజ్ఞాని జగ
ద్ధురితార్థమునకతనిమది తలచునో లేదో! ॥27॥

కంచివిడివచ్చె గురుని సంస్కార సరణి
చూచెయామునా భీష్టంబునేచితూచె
సర్వమీడేర్చ శపథంబు సలిపెకాని
రంగనితిరస్కరించె విరక్తుడగుచు ॥28॥

అతనివైదుష్యము ప్రవృత్తి యాత్మశక్తి
నున్నితహృదయమిందాకనుంత దెలియు
మన మహాపూర్ణుడె కడు సమర్థుడిందు
నీతనిమతిమార్చి రంగనియండఁజేర్చ ॥29॥

ఆళవందనారు లాంతరంగిక శిష్యు
లిట్లు నిశ్చయించి యెంతకాల
మైనవేచియమ్మహాత్ముతోడ్తెమ్మన,
పూర్ణుడుపయనించె పొలతితోడ ॥30॥

నామనంబునెప్పుడనలిపెడి తాత్త్విక
ప్రశ్నలకిటుతగుజవాబువచ్చె
నడవనివరదుండె' నన్నిటనడిపించె
పలుక నట్టిప్రభుడె పలికెనిపుడు ॥18॥

వరదకైంకర్య మిందు సాఫల్యమందె
స్వామివాగ్దేవి మద్గురువరుని చూపె
లక్ష్య సాధనకాత్మ బలంబు నీవ
యనగ పూర్ణుడాతీని కను లార జూచి ॥19॥

యామునాచార్య పీఠంబునధివసింప
పుట్టినమహాత్ముడవు మ హాపూర్ణగురుడె
నిన్ను శంఖ చక్రాంకితనియతుఁజేయు
ననగ గుడిలోని ఘంటలేగణగణమనె ॥20॥

యామునులులేని కొఱతశిష్యాళినలమె
రంగపురినెల్లకలచె శ్రీరంగనాథు
సన్నిధానమేయి ంత్రక సరణినడచె
జీవజగిములులెంచును చేవదప్పి ॥21॥

ఎప్పుడెప్పుడేసేవ యెట్లెట్లుజరుగ
వలెనొ! యటులనే స్వామికి జరుగుకాని
బ్రతుకులోరక్తి సేవలో శ్రద్ధతరిగె
శిష్యలీలోటుదీర్పకాంక్షిఎరంత ॥22॥

రామానుజుడొకడెగురువు
యామునహృదయాభిరాముడందరి యెదకే
ప్రేమాంకురమాగమనిగ
మామృతమేఘము నిరంతరాంతర్ముఖుడా ॥23॥

మనసుదెలిసి ధర్మమార్గంబు చూపు సం
ఘమును హరిపథంబుకడకుద్రిప్పు
శక్తి సంస్కృతిగల సమయోచితప్రాజ్ఞ
డతడె నేడుమనకు నాత్మరక్ష ॥25॥

యామునులమనం బాద్యంతమాత్మనెరిగి
యతని తత్త్వంబు సాధింప ప్రతినబూనె
నిత్యసత్యవ్రతుడు సదా నిర్మలాత్ము
డతని నెట్లైన నిటజేర్చుటందఱగుటే ॥26॥

గురుభక్తికలదు కానీ
గురుపీఠము నధివసింప కూరునో! లేదో
పరమార్థజ్ఞాని జగ
ద్భరితార్థమునకతనిమది తలచునొ లేదో! ॥27॥

కంచివిడీవచ్చి గురుని సంస్కార సరణి
చూచెయామునా భీష్టంబునేచితూచె
సర్వమీడేర్ప శపథంబు సలిపెకాని
రంగనితిరస్కరించె విరక్తుడగుచు ॥28॥

అతనివైదుష్యము ప్రవృత్తి యాత్మశక్తి
సున్నితహృదయమిందాకునుంత దెలియు
మన మహాపూర్ణుడె కడు సమర్థుడిందు
నీతనిమతిమార్చి రంగనియందుఁజేర్ప ॥29॥

ఆళవందనారు లాంతరంగిక శిష్యు
లిట్లు నిశ్చయించి యెంతకాల
మైనవేచియుమ్మహాత్ముతోడ్తెమ్మన,
పూర్ణుడువయనించె పాలతోడ ॥30॥

రంగపురిఁజేర రామానుజుడట కాం
చీపురంబుచేర శ్రీమహా
పూర్ణుడట కదలగముందయ్య మధురాంత
కమిరుపురిని (జొచ్చె ఘడియలోనె ||31||

వరదాయని రామానుజ
డెలుఁగగ రంగాయనియెదయెదనెత్తుకొనెఁ
గురుడుమహాపూర్ణుండా
హరిలీలావిభవ మెఱుగ నద్భుత మనగాఁ ||32||

దేవ! శ్రీవైష్ణవాగమదీక్ష నన్ను
శిష్యునింజేసి చరితార్థు చేయుడనగ
అయ్యా! రామానుజా! వరదయ్య సన్ని
ధి ముమహార్తాన దీక్ష పొంద శుభము! యన ||33||

కంచి కేగి మహాపూర్ణుగడియ చూడ
కాలహరణమౌ దేవ! దీక్షకు, శరీర
మెప్పుడేమౌనొ! యెవ్వడూహింపగలడు?
హరికృపకుదేశ కాలం పాధ్యలె? యన ||34||

మంచిది కుమార! దరినున్న మడుగులో జ
లకము లాడి, సీతారామలక్ష్మణుల
యాన మువ్వుర ప్రార్థించి యుండనున్న
వకుళ వృక్షంబుచేరుమా వత్సయిపుడె ||35||

వెంటనేమహాపూర్ణుడు విధివిధాన
మెఱిగి, ముద్రలంక యగ్ని వెలుగున శుచి
జేసి దేహాభిమానంబు వెలుగ శంఖ
చక్ర చిహ్నంబు నతని వైష్ణవుని జేసె ||36||

శంఖచక్రాంకితముష్నిష్నముమ శంఖ
మాత్మశక్తి మేల్కొల్పి, జన్మాంతరాల
పేరుకొన్నట్టి నిజయహంకారమడచి
జ్ఞాన మొ నగె సుదర్శన చక్రమపుడు ॥37॥

పైఁబడునరిషడ్వర్గాల పారద్రోల
వైష్ణవోచిత బాహువుల్ ప్రకృతిగుణము
లార్పమూర్ధ్వ పుండ్రములు ఫాలానమెరయ
లక్ష్మణుడులక్ష్య లక్షణ ప్రభుతమెరసె ॥38॥

ధర్మ పత్నితో పూర్ణుడు దండనిలువ
గురువరుడు శ్రీనివాసుడైగోచరించె
లక్ష్మణుడు పులకిత శరీరాంగుడగుచు
ఆదిదంపతులని మ్రొక్కె నధిక భక్తి ॥39॥

కేలుమోడ్చిదేవా! కొంతకాలమైన
అతిథిదేవులైయాత్మ గృహాంతరమున
వైష్ణవ శ్రీలసిచిన్నవాని తీర్చి
దిద్ది పాలింపుడంచు ప్రార్థింపఁగానె ॥40॥

పంచ సంస్కార విధులతో బాహ్యమెల్ల
భక్తిగామార్చు వైష్ణవ ప్రభుడవీవు
గురుల భుక్త శేషాన మాకున్ ప్రసాద
కాయములభించునిదెరండు కంచికనగ ॥41॥

రంగ! నీలీలలెరుఁగ చిత్రాతి చిత్ర
మయ్య దుష్కరంబన్నది యతిమలభము
మలభ మన్నది కష్టమై కలఁచునంచు
కంచికే తెంచె పూర్ణుడు కాంతతోడ ॥42॥

శిష్యునిగ్రహసీమ చీలిరెండయ్యె, వొ
క్కటి గురునకు మఱియొకటితనకిరు
వురికి బలమొకటియె హరి పరమార్థమే
ఒకటి రెండురెండునొక్కటయ్యె ॥43॥

శ్రుతుల తత్త్వ ము ద్వయమంత్ర శోభితమది
సంతతముననధ్యానాది సాధనముల
సచ్చిదానందమూర్తి సాక్షాత్కరించు
భక్తవరులకు వైకుంఠ పదమునిచ్చు ॥44॥

ద్రవిడదివ్య ప్రబంధాల దాగియున్న
విరహభక్తిలో వేదనా పరవశమున
సఖ్యవాత్సల్య మధుర ప్రసన్నగుణము
లన్నియు హరిదివ్యావస్థలై ముదమగు ॥45॥

ఋషులయుపనిషత్సారంబు నెల్లపిండి
బ్రహ్మసూత్రాల చేసె ద్వైపాయనుండు
ఆళవార్లప్రబంధగీతాలనెల్ల
ద్రవిడవేదాన గూర్చె నాథమునిమున్నె ॥46॥

ఆయిరువురి లక్ష్యమొకటై హాయిగూర్ప
జ్ఞానభక్తిప్రపత్తులే కలయ బండె
హరివిలాసా లనుభవిప నారువెలలు
అమృతగుళిక లై యానందమందుకొనిరి ॥47॥

ఉన్నదున్నట్టులాచార్యుకన్నతల్లి
కన్నుమూసికేశవ పద కమల మంటె
తలచితలచి పొంగెడి అశ్రుతర్పణమున
తల్లి కపరకర్మలు చేసె తనయుడంత ॥48॥

